# శ్రీ వినాయక వ్రతకల్పము



శ్రీ రత్నగర్భ గణపతి, శృంగేరి

యమేకాక్షరం నిర్మలం నిర్వికల్పం గుణాతీతమానందమాకారశూన్యమ్ ।
పరం పారమోంకారమామ్నాయగర్భం వదన్తి ప్రగల్భం పురాణం తమీడే ॥
శ్రీ గణేశ భుజంగ స్తోత్రం, 7 శ్లోకం

www.GRANTHANIDHI.blogspot.in


# వినాయక వ్రతం

ఏ పూజ అయినా, వ్రతమైనా, చివరకు ఏ శుభకార్యం ప్రారంభించా లన్నా ముందుగా వినాయకుడిని పూజించడం మన సాంప్రదాయం. అటువంటి వినాయకుడి జన్మదినంను 'వినాయక చవితి' లేదా 'గణేశ చతుర్థి' పర్వదినంగా జరుపుకుంటారు. ఈరోజున వినాయకుడి ప్రతిమను ఇంటిలో ప్రతిష్టించి స్వామివారికి పూజచేసి గరికతోపాటు, 21 పత్రాల్తో పూజించి, వ్రతకథ చెప్పుకుని, ఉండ్రాళ్ళు, కుడుములు తదితరములైన పిండివంటకాలు నైవేద్యంగా సమర్పించుకుని ఇంటిల్లిపాదీ ఘనంగా పండుగ జరుపుకుంటాం.

హిందూ సాంప్రదాయం ప్రకారం వినాయకుడు సకల దేవతా గణానికి అధిపతి (గణనాయకుడు), అన్ని పూజలకు ప్రప్రథమంగా పూజింపవలసిన వాడు. అందుకే ప్రతి శుభకార్యానికి, పూజకు మొదటిగా మనం గణపతిపూజ తోనే ప్రారంభిస్తాం. అది పిల్లవాడి బారసాల, విద్యాభ్యాసం నుండి, వివాహం, శంకుస్థాపన, గృహప్రవేశం, వ్యాపార ప్రారంభోత్సవాలు, నూతన వాహనం కొనుగోలు ఇలా ఒక సందర్భం ఏమిటి మానవ జీవితంలో ప్రతి ప్రధానమైన శుభకార్యానికి మొదటిగా గణపతిని పూజించటం అనాదిగా వస్తున్న సాంప్రదా యం. ఇలా మన ప్రతి పని విజయానికీ, చదువుకు, జ్ఞానానికీ దిక్కైన దేవుడు మన వినాయకుడు. అందుకే మనం మొదలుపెట్టే ప్రతి ముఖ్యమైన పని ఎటువంటి విఘ్నాలు కలగకుండా విజయవంతంగా జరగాలని వినాయకుని ప్రార్తిస్తూ ఉంటాం.

ముందుగా వినాయకుడిని సంతోషపెడితే ఆటంకాలు రాకుండా సకల కార్యాలు పొంది, ఐశ్వర్యాలు సిద్ధించి కష్టాలు దూరమవుతాయని ప్రజల విశ్వాసం. భాద్రపద శుద్ధ చవితినాడు వినాయకుడు జన్మించినది. అన్ని విఘ్నా లపై ఆధిపత్యం జరిగినట్లుగా పురాణాలబట్టి పండితులు తెలుపుతున్నందున మనదేశంతోపాటు ఇతర దేశాలలోని వారు కూడా ప్రతి సంవత్సరము భాద్రపద శుద్ధ చవితినాడు, బంగారం, వెండి మట్టితో తయారుచేసిన ప్రతిమలకు కుటుంబ సభ్యులు అందరూ పూజించటం వల్ల మంచి ఫలితాలు అందుతాయని పురాణ కథలు తెలుపుచున్నాయి.

మట్టితో చేసిన గణపతి విగ్రహాన్ని పూజించడం వలన కరువు కాటకాలు రాకుండా పంటలు సమృద్ధిగా పండుతాయని ప్రతీతి. వ్యవసాయ అభివృద్ధి కలుగుతుంది. బంగారు గణపతి ప్రతిమ ఐశ్వర్యాభివృద్ధిని, వెండి ప్రతిమ ఆయురారోగ్యాన్నీ, రాగి ప్రతిమ సంకల్పసిద్ధిని, శిలా ప్రతిమ మోక్ష, జ్ఞానాలను అనుగ్రహిస్తాయని పురాణాలు చెబుతున్నాయి.

శ్రీ గణేశాయ నమః

ప్రతి సంవత్సరమూ, వినాయక వ్రతము చేయు సందర్భమున, శ్యమంతకోపాఖ్యానమును విపులముగా చదువుకొను కనుకూలముగా వ్రాసి యిమ్మని **బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు గారిని** కోరి, భక్తులందరి ప్రయోజనము కొరకీ చిన్ని పొత్తము అందింపబడుచున్నది.

శ్రీ గురువాణి
సభ్య మండలి

## గణేశపఞ్చరత్నమ్

ముదాకరాత్తమోదకం సదా విముక్తిసాధకం
కళాధరావతంసకం విలాసిలోకరక్షకమ్ ।
అనాయకైకనాయకం వినాశితేభదైత్యకం
నతాశుభాశునాశకం నమామి తం వినాయకమ్ ॥

నతేతరాతి భీకరం నవోదితార్కభాస్వరం
నమత్సురారినిర్జరం నతాధికాపదుద్ధరం ।
సురేశ్వరం నిధీశ్వరం గజేశ్వరం గణేశ్వరం
మహేశ్వరం తమాశ్రయే పరాత్పరం నిరన్తరమ్ ॥

సమస్తలోక శంకరం నిరస్తదైత్యకుంజరం
దరేతరోదరం వరం వరేభవక్త్రమక్షరమ్ ।
కృపాకరం క్షమాకరం ముదాకరం యశస్కరం
మనస్కరం నమస్కృతాం నమస్కరోమి భాస్వరమ్ ॥

అకిఞ్చనార్తిమార్జనం చిరంతనోక్తి భాజనం
పురారి పూర్వనన్దనం సురారిగర్వ చర్వణమ్ ।
ప్రపంచ నాశభీషణం ధనఞ్జయాది భూషణం
కపోలదానవారణం భజే పురాణవారణమ్ ॥

నితన్తకాన్తిదన్తకాన్తి మన్తకాన్తికాత్మజం
అచిన్త్యరూపమన్త హీన మన్తరాయకృన్తనమ్ ।
హృదన్తరే నిరన్తరం వసన్తమేవ యోగినాం
తమేకదన్తమేవ తం విచిన్తయామి సన్తతమ్ ॥

మహాగణేశపఞ్చరత్నమాదరేణ యోఽన్వహం
ప్రజల్పతి ప్రభాతకే హృదిస్మరన్గణేశ్వరమ్ ।
అరోగతామదోషతాం సుసాహితీం సుపుత్రతాం
సమాహితాయురష్టభూతిమభ్యుపైతిః సోఽచిరాత్ ॥

శ్రీమహాగణాధిపతయే నమః

# శ్రీ వరసిద్ధివినాయక వ్రత కల్ప ప్రారంభః

స్నానముచేసి భస్మము ధరించి అనుష్ఠానము దీర్చుకొని పూజా ద్రవ్యములు సిద్ధపరచుకొని దీపము వెలిగించి చేతులు జోడించి వినాయకుని ప్రార్థించవలెను.

## వినాయక ప్రార్థన

గీ॥ అగజానన పద్మార్కం
గజానన మహర్నిశం
అనేకదం తం భక్తానామ్
ఏకదంత ముపాస్మహే ॥

అయం ముహూర్త స్సుముహూర్తో
స్వితిభవంతో మహంతోను గృహ్ణంతు

## పార్వతీ పరమేశ్వర ప్రార్థన

శ్లో॥ యశ్శివోనామ రూపాభ్యాం
యాదేవీ సర్వమంగళా
తయోస్సంస్మరణాత్పుంసాం
సర్వతో జయ మంగళం ॥

శుక్లాంబరధరం విష్ణుం
శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే
త్సర్వవిఘ్నోపశాంతయే ॥

తదేవ లగ్నం సుదినంతదేవ
తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలం తదేవ
గౌరీపతే తేంఘ్రియుగంస్మరామి॥

స్మృతే సకల కల్యాణ
భాజనం యత్రజాయతే
పురుషస్త మజం నిత్యం
వ్రజామి శరణం శివం ॥

సర్వదా సర్వ కార్యేషు
నాస్తి తేషా మమఙ్గలమ్
యేషాం హృదిస్థో భగవాన్
మంగళాయతనం శివః॥

లాభస్తే షాం జయస్తే షాం
కుతస్తేషాం పరాభవః
యేషా మిందు నిభాకారో
హృదయస్థో మహేశ్వరః॥

ఆపదామపహర్తారం
దాతారం సర్వ సంపదాం
లోకాభిరామం శ్రీరామం
భూయోభూయో నమామ్యహం॥

సర్వమంగళ మాంగళ్యే
శివే సర్వార్థ సాధకే
శివే సర్వార్థ సాధకే
శరణ్యే త్ర్యంబకేదేవి
నారాయణి నమోస్తుతే ॥

## దేవతాది నమస్కారః

ఉమా, మహేశ్వరాభ్యాం నమః। తద్వామభాగస్థిత లక్ష్మీనారాయణా భ్యాం నమః। తద్దక్షిణ భాగస్థిత వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః। తత్పురోభాగ స్థితశచీపురందరాభ్యాం నమః। అరున్ధతీ వసిష్ఠాభ్యాం నమః। సర్వేభ్యో మహా జనేభ్యో నమః॥

## ఆచమనం

ఓం కేశవాయస్వాహా, ఓం నారాయణాయస్వాహా, ఓం మాధవాయ స్వాహా, గోవిందాయనమః, విష్ణవే నమః, మధుసూదనాయ నమః, త్రివిక్రమాయ నమః, వామనాయనమః, శ్రీధరాయనమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్ధనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయేనమః, శ్రీకృష్ణాయ నమః

## భూతోచ్చాటనం

శ్లో॥ ఉత్తిష్ఠంతు భూతపిశాచాః
యేతే భూమి భారకాః
ఏతేషా మవిరోధేన
బ్రహ్మకర్మ సమారభే ॥

## భూశుద్ధి

ఓం పృధివ్యాః మేరోః పృష్ఠఋషిః
కూర్మోదేవతా సుతలం ఛంద
ఆసనే వినియోగః
ఓం అనంతాసనాయనమః

## ప్రాణాయామము

ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహతః, ఓం తపః ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్ । ఓమాపోజ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోం ॥

## దేశకాలాది సంకీర్తనము

మమ, ఉపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్ధిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శివ శివ శంభోరాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణః, ద్వితీయ పరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వన్తరే అష్టావింశ మహాయుగే కలియుగే, ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే, మేరోర్ధక్షిణ దిగ్భాగే శ్రీశైలస్యేశాన్య ప్రదేశే కృష్ణా గోదావర్యోర్మధ్యదేశే స్వగృహే సమస్త దేవతా మాహేశ్వర సన్నిధౌ అస్మిన్వర్తమాన వ్యావహారిక చంద్రమానేనే... సంవత్సరే... ఆయనేవర్షఋతౌ భాద్రపదమాసే శుక్లపక్షే చతుర్థ్యాం...వాసరే శుభనక్షత్రే శుభయోగే శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ అస్మాకం సకుటుంబానాం క్షేమ స్థైర్య విజయాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం ధర్మార్ధ కామోక్ష చతుర్విధ ఫలపురుషార్ధ సిద్ధ్యర్థం, పుత్రపౌత్రాభి వృద్ధ్యర్థం, ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం సమస్త దురితోప శాంత్యర్థం, సమస్త మంగళా వాప్త్య ర్థం, వర్షే వర్షే ప్రయుక్త వరసిద్ధి వినాయక దేవతా ముద్దిశ్య, వరసిద్ధి వినాయక దేవతా ప్రీత్యర్థం, కల్పోక్త ప్రకారేణ, వరసిద్ధి వినాయకస్య, యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే ॥

### కలశపూజ

ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిప పూజాంకరిష్యే । తదంగ కలశారాధనం కరిష్యే । కలశంచ భస్మనాగంధ పుష్పాక్షతై రభ్యర్చ్య ॥

### దేవతీర్థాద్యావాహనము

శ్లో॥ కలశస్య ముఖేవిష్ణుః
కంఠే రుద్ర స్సమాశ్రితః
మూలేత్రత స్థితో బ్రహ్మ
మధ్యేమాతృగణాస్మృతాః॥
కుక్షౌతుసాగరా స్సర్వే
సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదోథ యజుర్వేద
స్సామవేదో హ్యథర్వణః॥
అంగైశ్చ సహితాస్సర్వే
కలశాంబు సమాశ్రితాః॥
గంగేచ యమునే కృష్ణే
గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి
జలేస్మిం త్సన్నిధింకురు ॥

ఆయాంతు దేవపూజార్థం దురిత క్షయ కారకాః కలశోదకేన పూజా ద్రవ్యాణి దేవమాత్మానంచ సంప్రోక్ష్య॥

www.Facebook.com/Mohanpublications


## పూజా ప్రారంభము

శ్లో॥ స్వామిన్, సర్వజగన్నాథ
యావత్పూజావసానగాః
తావత్త్వం ప్రీతి భావేన
బింబేస్మిన్ సన్నిధింకురు

### 1. ధ్యానం

శ్లో॥ ఏకదంతం శూర్పకర్ణం
గజవక్త్రం చతుర్భుజం
పాశాంకుశధరం దేవం
ధ్యాయేత్సిద్ధి వినాయకం॥
వరసిద్ధివినాయకం ధ్యాయామి.

### 2. ఆవాహనం

శ్లో॥ అత్రాగచ్ఛ జగద్వంద్య
సురరాజార్చి తేశ్వర
అనాధ నాధ ! సర్వజ్ఞ
గౌరీగర్భ సముద్భవ ॥
వరసిద్ధివినాయకమావాహయామి

### 3. స్వాగతాది దర్శనం

శ్లో॥ స్వాగతంతే దదామీశ
తప్తకాంచన సన్నిభ
చతుర్భుజ ! మహాకాయ
సర్వాభరణ భూషితః॥
వరసిద్ధివినాయకాయ !
స్వాగతాదీర్సమర్పయామి

### 4. ఆసనం

శ్లో॥ విచిత్ర రత్న ఖచితం
దివ్యాభరణ సంయుతం
స్వర్ణ సింహాసనం దేవ
గృహాణ సురపూజిత ॥
వరసిద్ధి వినాయకాయ,
స్వర్ణసింహాసనం సమర్పయామి

### 5. పాద్యం

శ్లో॥ సర్వతీర్థ సముద్భూతం
పాద్యం గంగాది సంయుతం
విఘ్నరాజ ! గృహాణేదం
భగవన్భక్త వత్సల
వరసిద్ధి వినాయకాయ పాద్యం
సమర్పయామి.

### 6. అర్ఘ్యం

శ్లో॥ అర్ఘ్యంచ ఫల సంయుక్తం
గంధ పుష్పాక్షతై ర్యుతం
గణాధ్యక్ష నమస్తేస్తు
గృహాణ కరుణానిధే ॥
వరసిద్ధి వినాయకాయ, అర్ఘ్యం
సమర్పయామి.

### 7. ఆచమనీయకం

శ్లో॥ వినాయక నమస్తుభ్యం
త్రిదశేరభి వందిత !
గంగోదకేన శుద్ధేన
శీఘ్ర మాచమనం కురు ॥
వరసిద్ధి వినాయకాయ,ఆచమ
నీయం సమర్పయామి

### 8. మధుపర్కం

శ్లో॥ దధ్యాజ్యమధు సంయుక్తం
మధుపర్కం మయాహృతం
గృహాణ సర్వలోకేశ
గణనాధ నమోస్తుతే॥
వరసిద్ధి వినాయకాయ
మధుపర్కం సమర్పయామి

## 9. స్నానం

(1) పంచామృతస్నానం

శ్లో॥ పయోదధి ఘృతోపేతం
శర్కరా మధు సంయుతం
పంచామృత స్నానమిదం
గృహ్యతాం గణనాయక

వరసిద్ధి వినాయకాయ, పంచామృత స్నానం సమర్పయామి.

(2) శుద్ధోదక స్నానం

శ్లో॥ గంగాది సర్వతీర్థేభ్య
శ్చాహృతై రమలై ర్జలైః
స్నానం కురుష్వ భగవన్
ఉమాపుత్ర ! నమోస్తుతే ॥

వరసిద్ధి వినాయకాయ, శుద్ధోదక స్నానం సమర్పయామి.

## 10. వస్త్రం

శ్లో॥ శుభవస్త్ర యుగ్మం దేవ
దివ్యకాంచన సన్నిభం
శుభప్రద గృహాణత్వం
లంబోదర! హరాత్మజ ॥

వరసిద్ధి వినాయకాయ, వస్త్రయుగ్మం సమర్పయామి.

## 11. యజ్ఞోపవీతం

శ్లో॥ రాజితం బ్రహ్మ సూత్రంచ
శుక్లాంబరధర ప్రియ
గృహాణ దేవ సర్వజ్ఞ !
భక్తాభీష్ట ప్రదాయక ॥

వరసిద్ధి వినాయకాయ, యజ్ఞోపవీతం సమర్పయామి.

## 12. విభూతిః

శ్లో॥ అష్టైశ్వర్య ప్రదంభస్మ
పవిత్రం లోకపావనం
దదామి విఘ్న రాజత్వం
గృహాణ సురవందిత॥

వరసిద్ధి వినాయకాయ విభూతిం సమర్పయామి.

## 13. గంధం

శ్లో॥ కస్తూరీ చందనోపేతం
కేసరేణ సమన్వితం
విలేపనం సురశ్రేష్ఠ
ప్రీత్యర్థ్యం ప్రతిగృహ్యతాం ॥

వరసిద్ధి వినాయకాయ, శ్రీ గంధం సమర్పయామి.

## 14. అక్షతలు

శ్లో॥ రక్తాక్షతాంశ్చ దేవేశ
గృహాణ ద్విరదానన
లలాట ఫలకే చంద్ర
తస్యో పర్యవధార్యతాం॥

వరసిద్ధి వినాయకాయ, అక్షతాన్ సమర్పయామి.

## 15. భూషణం

శ్లో॥ నానావిధాని దివ్యాని
నానారత్నో జ్వలానిచ
భూషణాని గృహాణేశ
పార్వతీ ప్రియ నందన॥

వరసిద్ధి వినాయకాయ ఆభరణాని సమర్పయామి.

### 16. సింధూరం

శ్లో॥ ఉద్యద్భాస్కర సంకాశం
సంధ్యా వదరుణం ప్రభో
వీరాలంకరణం దివ్యం
సింధూరం ప్రతిగృహ్యతాం॥

వరసిద్ధి వినాయకాయ, సింధూర భూషణం సమర్పయామి.

### 17. మాల్యం

శ్లో॥ మాల్యాదీని సుగంధాని
మాలత్యా దీనివై ప్రభో
మయాహృతాని పుష్పాణి
ప్రతిగృహ్ణీష్వ శాంకర! ॥

వరసిద్ధి వినాయకాయ,
పుష్పమాల్యాని సమర్పయామి.

### 18. పుష్పాణి

శ్లో॥ కరవీరై ర్జాతికుసుమై
శ్చంపకై ర్వకులైశ్శుభైః
శతపత్రై శ్చకల్హారై
అర్చయే ద్గణనాయకం ॥

**అథాంగ పూజా**

గణేశాయనమః పాదౌ పూజయామి
ఏకదంతాయ నమః గుల్ఫౌపూజయామి
శూర్పకర్ణాయనమః జానునీపూజయామి
విఘ్నరాజాయనమః జఙ్ఘే పూజయామి
ఆఖువాహనాయనమః ఊరూపూజయామి
హేరమ్బాయనమః కటిం పూజయామి
లంబోదరాయ నమః ఉదరంపూజయామి
గణనాథాయనమః నాభిం పూజయామి
గణేశాయనమః హృదయంపూజయామి
స్థూలకణ్ఠాయనమఃకణ్ఠం పూజయామి
స్కన్దాగ్రజాయనమః స్కందౌ పూజయామి
పాశహస్తాయనమః హస్తౌ పూజయామి
గజవక్త్రాయనమః వక్త్రం పూజయామి
విఘ్న హన్త్రే నమః నేత్రే పూజయామి
శూర్పకర్ణాయనమః కర్ణౌ పూజయామి
ఫాలచంద్రాయనమః లలాటంపూజయామి
విఘ్నరాజాయ నమః సర్వాణ్యంగాని పూజయామి

**ఏకవింశతి పత్రపూజ**

**సుముఖాయ నమః** మాచీపత్రం సమర్పయామి (మాచిపత్రి)

**గణాధిపాయ నమః** బృహతీపత్రం సమర్పయామి(బలురక్కసిలేకములగ)

**ఉమాపుత్రాయనమః** బిల్వపత్రం సమర్పయామి (మారేడు)

**గజాననాయనమః** దూర్వాయుగ్మం సమర్పయామి (గరికె)

**హరసూనవే నమః** దుత్తూరపత్రం సమర్పయామి (ఉమ్మెత్త)

**లంబోదరాయ నమః** బదరీపత్రం సమర్పయామి (రేగు)

**గుహాగ్రజాయనమః** అపామార్గపత్రం సమర్పయామి (ఉత్తరేణి)

**గజకర్ణాయనమః** దేవకాంచనపత్రం సమర్పయామి (కోవిదారము)

**ఏకదంతాయ నమః** చూతపత్రం సమర్పయామి (మామిడి)
**వికటాయనమః** కరవీరపత్రం సమర్పయామి (గన్నేరు)
**భిన్నదంతాయనమః** విష్ణుక్రాంతపత్రం సమర్పయామి (విష్ణుకాంతము)
**వటవే నమః** దాడిమీపత్రం సమర్పయామి (దానిమ్మాకు)
**సర్వేశ్వరాయనమః** దేవదారుపత్రం సమర్పయామి (దేవదారు)
**ఫాలచంద్రాయనమః**మరువకపత్రం సమర్పయామి (మరువం)
**హేరమ్బాయనమః** సిన్దువారపత్రం సమర్పయామి (వావిలాకు)
**శూర్పకర్ణాయనమః** జాతీపత్రం సమర్పయామి (జాజిఆకు)
**సురాగ్రజాయనమః** ధాతకీపత్రం సమర్పయామి (ఆరెపత్రి)
**ఇభవక్త్రాయనమః** శమీపత్రం సమర్పయామి (జమ్మిపత్రి)
**వినాయకాయనమః** జంబూపత్రం సమర్పయామి (నేరేడు)
**సురసేవితాయనమః** కపిత్థపత్రం సమర్పయామి (వెలగ)
**కపిలాయనమః** అర్కపత్రం సమర్పయామి (జిల్లేడాకు)
వరసిద్ధి వినాయకాయ ఏకవింశతి పత్రాణి సమర్పయామి

## అష్టోత్తర శతనామావళిః

ఓం గజాననాయ నమః
ఓం గణాక్షాయ నమః
ఓం విఘ్న రాజాయ నమః
ఓం వినాయకాయ నమః
ఓం ద్వైమాతురాయ నమః
ఓం ద్విముఖాయ నమః
ఓం ప్రముఖాయ నమః
ఓం సుముఖాయ నమః
ఓం కృతినే నమః
ఓం సుప్రదీపాయ నమః
ఓం సుఖనిధయే నమః
ఓం సురాధ్యక్షాయ నమః
ఓం సురారిఘ్నాయ నమః
ఓం మహాగణాధిపతయే నమః
ఓం మాన్యాయ నమః
ఓం మహాకాలాయ నమః
ఓం మహాబలాయ నమః
ఓం హేరమ్బాయ నమః
ఓం లమ్బజఠరాయ నమః
ఓం హ్రస్వగ్రీవాయ నమః
ఓం మహోదరాయ నమః
ఓం మదోత్కటాయ నమః
ఓం మహావీరాయ నమః
ఓం మన్త్రిణే నమః
ఓం మఙ్గళస్వరాయ నమః
ఓం ప్రమదాయ నమః
ఓం ప్రథమాయ నమః
ఓం ప్రాజ్ఞాయ నమః

ఓం విఘ్నకర్త్రే నమః
ఓం విఘ్న హర్త్రే నమః
ఓం విశ్వనేత్రే నమః
ఓం విరాట్పతయే నమః
ఓం శ్రీపతయే నమః
ఓం వాక్పతయే నమః
ఓం శృంగారిణే నమః
ఓం ఆశ్రితవత్సలాయ నమః
ఓం శివప్రియాయ నమః
ఓం శీఘ్రకారిణే నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం బలాయ నమః
ఓం బలోత్థితాయ నమః
ఓం భవాత్మజాయ నమః
ఓం పురాణపురుషాయ నమః
ఓం పూష్ణే నమః
ఓం పుష్కరోత్థిప్తవారిణే నమః
ఓం అగ్రగణ్యాయ నమః
ఓం అగ్రపూజ్యాయ నమః
ఓం అగ్రగామినే నమః
ఓం మన్త్రకృతే నమః
ఓం చామీకరప్రభాయ నమః
ఓం సర్వస్మై నమః
ఓం సర్వోపాస్యాయ నమః
ఓం సర్వకర్త్రే నమః
ఓం సర్వనేత్రే నమః
ఓం సర్వసిద్ధి ప్రదాయ నమః
ఓం సర్వసిద్ధయే నమః
ఓం పఞ్చహస్తాయ నమః
ఓం పార్వతీనన్దనాయ నమః
ఓం ప్రభవే నమః
ఓం కుమారగురువే నమః
ఓం అక్షోభ్యాయ నమః
ఓం కుఞ్జరాసురభఞ్జనాయ నమః
ఓం ప్రమోదాయ నమః
ఓం మోదకప్రియాయ నమః
ఓం కాన్తిమతే నమః
ఓం ధృమతే నమః
ఓం కామినే నమః
ఓం కపిత్థవనప్రియాయ నమః
ఓం బ్రహ్మచారిణే నమః
ఓం బ్రహ్మరూపిణే నమః
ఓం బ్రహ్మవిద్యాదిదానభువే నమః
ఓం జిష్ణవే నమః
ఓం విష్ణుప్రియాయ నమః
ఓం భక్తజీవితాయ నమః
ఓం జితమన్మథాయ నమః
ఓం ఐశ్వర్యకారణాయ నమః
ఓం జ్యాయసే నమః
ఓం యక్షకిన్నరసేవితాయ నమః
ఓం గంగాసుతాయ నమః
ఓం గణాధీశాయ నమః
ఓం గమ్భీరనినదాయ నమః
ఓం వటవే నమః
ఓం అభీష్టవరదాయ నమః
ఓం జ్యోతిషే నమః
ఓం భక్త నిధయే నమః
ఓం భావగమ్యాయ నమః
ఓం మఙ్గళప్రదాయ నమః
ఓం అవ్యక్తాయ నమః

ఓం అపాకృతపరాక్రమాయ నమః
ఓం సత్యధర్మిణే నమః
ఓం సఖ్యే నమః
ఓం సరసామ్బునిధయే నమః
ఓం మహేశాయ నమః
ఓం దివ్యాంగాయ నమః
ఓం మణికిఙ్కిణీమేఖలాయ నమః
ఓం సమస్తదేవతామూర్తయే నమః
ఓం సహిష్ణవే నమః
ఓం సతోత్థితాయ నమః
ఓం విఘాతకారణే నమః
ఓం విశ్వగ్దృశే నమః
ఓం విశ్వరక్షాకృతే నమః
ఓం కల్యాణగురవే నమః
ఓం ఉన్మత్తవేషాయ నమః
ఓం అపారపరాక్రమాయ నమః
ఓం సమస్తజగదాధారాయ నమః
ఓం సర్వైశ్వర్యప్రదాయ నమః
ఓం అక్రాన్తచిదచిత్ప్రభవే నమః
ఓం విఘ్నేశ్వరాయ నమః

వరసిద్ధి వినాయకాయ, అష్టోత్తర శత నామపూజాం సమర్పయామి.

(అక్షతలుతీసికొని కథ చదువుకొనవలెను)

## బిల్వం

శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం
త్రినేత్రంచ త్రియాయుధం
త్రిజన్మ పాప సంహారం
ఏకబిల్వం శివార్పణం ॥

వరసిద్ధి వినాయకాయ, బిల్వపత్రం సమర్పయామి.

## ధూపం

శ్లో॥ దశాంగం గుగ్గులోపేతం
సుగంధం సుమనోహరం
గృహాణ సర్వదేవేశ
ఉమాపుత్ర ! నమోస్తుతే ॥

వరసిద్ధి వినాయకాయ, ధూపమాఘ్రాపయామి

## దీపం

శ్లో॥ సర్వజ్ఞ ! సర్వలోకేశ
త్రైలోక్య తిమిరాపహ
గృహాణ మంగళం దీపం
రుద్రప్రియ నమోస్తుతే ॥

వరసిద్ధివినాయకాయ దీపందర్శయామి

## నైవేద్యం

శ్లో॥ బీజపూరామ్ర పనస
ఖర్జూర కదళీఫలం
నారికేళ ఫలం దివ్యం
గృహ్యాతాం జగతః పతే॥

శ్లో॥ ఏకవింశతి సంఖ్యాకా
న్మోదకాన్, ఘృతాపాచితాన్
అన్యాని భక్ష్య భోజ్యాని
చోష్య లేహ్యాది కానిచ ॥

శ్లో॥ మయాదత్తాని సంగృహ్య
నైవేద్యం విఘ్న నాయకా
ఈప్సితం మేవరం దేహి
పవిత్రంచ పరాంగతిం ॥

వరసిద్ధివినాయకాయ, భక్ష్య భోజ్య లేహ్య చోష్యాది, మహా నైవేద్యం సమర్పయామి

## పానీయం

శ్లో॥ మహాస్వాద్య మిదం దివ్యం
పానీయం తే నివేదితం
మయాభక్త్యా శివాపుత్ర
గృహాణ గణనాయక ॥

వరసిద్ధి వినాయకాయ, మధ్యేమధ్యే ఉదకం సమర్పయామి, ఉత్తరా పోశనం సమర్పయామి.

## కరోద్వర్తనం

శ్లో॥ మలయాచల సంభూతం
పుష్కరేణ సుమిశ్రితం
కరోద్వర్తనం తీర్థం
గృహ్యతాం గణనాయక॥

వరసిద్ధి వినాయకాయ, హస్త ప్రక్షాళ నార్థ ముదకం సమర్పయామి.

## తాంబూలం

శ్లో॥ పూగీఫల సమాయుక్తం
నాగవల్లీ దళైర్యుతం
ముక్తాచూర్ణ సమాయుక్తం
తాంబూలం ప్రతిగృహ్యతాం॥

వరసిద్ధి వినాయకాయ, తాంబూలం సమర్పయామి.

## నీరాజనం

శ్లో॥ చంద్రాదిత్యౌ గణేశాన
విద్యుదగ్ని స్త దైవచ
త్వమేవ సర్వతేజాంసి
ఆర్తికా ప్రతిగృహ్యతాం ॥

వరసిద్ధివినాయకాయ కర్పూర నీరాజనం దర్శయామి.

## దూర్వాయుగ్మ పూజ

గణాధిపాయ నమః
దూర్వాయుగ్మం పూజయామి
ఉమాపుత్రాయ నమః
దూర్వాయుగ్మం పూజయామి
ఆఖువాహనాయ నమః
దూర్వాయుగ్మం పూజయామి
ఈశపుత్రాయ నమః
దూర్వాయుగ్మం పూజయామి
వినాయకాయ నమః
దూర్వాయుగ్మం పూజయామి
సర్వసిద్ధి ప్రదాయ నమః
దూర్వాయుగ్మం పూజయామి
ఏకదంతాయ నమః
దూర్వాయుగ్మం పూజయామి
ఇభవక్త్రాయ నమః
దూర్వాయుగ్మం పూజయామి
మూషిక వాహనాయనమః
దూర్వాయుగ్మం పూజయామి
కుమార గురవే నమః
దూర్వాయుగ్మం పూజయామి

## సువర్ణ మంత్రపుష్పం

శ్లో॥ వినాయకకేశ పుత్రస్త్వం
గణరాజ సురోత్తమ
దేహిమే సకలాన్భోగాన్
త్వాం వందే సంతతం ధ్రువం॥

వరసిద్ధి వినాయకాయ, సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి

## ప్రదక్షిణం

శ్లో॥ విఘ్నేశ్వర ! విశాలాక్ష !
సర్వాభీష్ట ఫలప్రద
ప్రదక్షిణం కరోమిత్వాం
సర్వాన్కామాన్ ప్రయచ్ఛమే
యానికానిచ పాపాని
జన్మాంతర కృతానిచ
తాని తాని ప్రణశ్యంతి
ప్రదక్షిణ పదే పదే ॥

వరసిద్ధి వినాయకాయ, ప్రదక్షిణం సమర్పయామి.

## నమస్కారః

శ్లో॥ యంబ్రహ్మ వేదాన్తవిదోవదన్తి
వరం ప్రధానం పురుషంతథాన్యే
విశ్వోద్గతేః కారణమీశ్వరంవా!
తస్మై నమో విఘ్నవినాయకాయ

శ్లో॥ వినాయక నమస్తుభ్యం
సతతం మోదక ప్రియం
నిర్విఘ్నం కురుమే దేవ
సర్వకార్యాణి సర్వదా ॥

శ్లో॥ నమస్తే విఘ్న సంహర్త్రే
నమో భక్తేప్సితప్రద
నమస్తే దేవదేవాయ
నమస్తే గణనాయక ॥

వరసిద్ధి వినాయకాయ, నమస్కారాన్సమర్పయామి.

శ్లో॥ యస్యస్మృత్యాచ నామోక్త్యా
తపః పూజా క్రియాదిషు
న్యూనం సంపూర్ణతాంయాతి
సద్యోవందే గణాధిపం
మంత్రహీనం క్రియాహీనం
భక్తిహీనం గణాధిప
యత్పూజితం మయాదేవ
పరిపూర్ణం తదస్తుతే ॥

అనయా ధ్యానావాహనాది పూజయా, భగవాన్సర్వాత్మకః గణాధిపతిస్సు ప్రీత స్సుప్రసన్నో వరదో భవతు॥ మమ ఇష్టకామ్యార్థ సిద్ధిరస్త్వితి భవంతో బృవంతు, మమ ఇష్ట కామ్యార్థ ఫలసిద్ధిరస్తు ॥

## వాయనదానం

(బ్రాహ్మణునికి వాయనదానం)

శ్లో॥ దశానాం మోదకానాంచ
ఫలదక్షిణయా యుతం
విప్రాయ తవతుష్ట్యర్థం
వాయనం ప్రదదామ్యహం ॥

## ప్రతిగ్రహ మంత్రః

(బ్రాహ్మణులు చెప్పును)

శ్లో॥ గణేశః ప్రతిగృహ్ణాతు
గణేశోవై దదాతిచ
గణేశ స్తారకో ద్వాభ్యాం
గణేశాయ నమో నమః॥

## ఉద్వాసన మంత్రము

యజ్ఞేన యజ్ఞమయజంత దేవస్తాని ధర్మాణి ప్రధమాన్యాసన్, తేహనాకం మహిమానస్సచంతే, యత్ర పూర్వే సాధ్యాస్సంతిదేవాః॥

## ప్రతిమాదానం

శ్లో॥ వినాయకస్య ప్రతిమాం
వస్త్రయుగ్మ సమన్వితాం
తుభ్యం దాస్యామి విప్రేంద్ర
యథోక్త ఫలదోభవః॥

## విఘ్నేశ్వరుని మంగళ హారతి

శ్రీశంభు తనయునకు సిద్ధి గణనాధునకు
వాసిగల దేవతా వందితునకు।
నాసరసవిద్యలకు నాధిగురువై నట్టి ।
భూసురోత్తమ లోక పూజితునకు॥
జయమంగళం నిత్యశుభమంగళం ॥1॥

పార్వతీ పుత్రునకు భవ్య చారిత్రు నకు।
నిర్వాణపద్మ దళనేత్రునకును ।
గీర్వాణ స్తోత్రునకుఁ గీర్తి సంపాత్రు నకుఁ
బర్వమున దేవగణపతికినిపుడు ॥జ॥2॥

అంబికా తనయునకు నలగొప్ప వేల్పునకు
లంబోదరాధీశ లక్షణునకు ।
కుంభినీ విద్యలకు గురువైన స్వామికిని।
బరమబుద్ధిచ్చు గణపతికి నిపుడు ॥జయ॥3॥

నేరేడు మారేడు నెలవంక మామిడి
దూర్వార చంగల్వ ఉత్తరేణు ।
వేరు వేరుగ దెచ్చి వేడ్కడతో ।
బూజింతుఁ బర్వమున దేవ గణపతికి నిపుడు ॥జయ॥4॥

ఏక దంతంబును నెల్ల గజవదనంబు
రాకన తుండంబు రమణ గలిగి ।

జోకైక మూషకము సురభి నెక్కాడుచును ।
మాకు బుద్ధిచ్చు గణపతికి నిపుడు ॥జయ॥ 5॥

వెండి పళ్ళెములోన వెలలేని ముత్యాలు
పొందుగా నీలాలు బోసికలియ ।
మెండైన హారములు మెడనిండ ధరియించి
దండిగా నీకిత్తు ధవళారతి॥ జయ ॥ 6॥

సుచిరమున భాద్రపద, శుద్ధ చవితియందుఁ।
బొసగ సజ్జనులచే బూజగొనుచు ।
శశిఁజూడ రాదనుదుఁజేపట్టి నొక వ్రతము।
పసవెలయు దేవగణపతికి నిపుడు ॥జయ॥ 7॥

పానకం వడపప్పు పనసమామిడిపండ్లు।
దానిమ్మ,ఖర్జూర ద్రాక్షపండ్లు, తేనె యరటిపండ్లు తెప్పలుగఁ
దెప్పించి పర్వ మున వెలయు గణపతికి నిపుడు ॥జయ॥ 8॥

ఎలుకవాహనమెక్కి యెంత వేడుకతోను ।
మరచి మరువక నున్న మానసమున।
తెలుపుదంతముఁ గ్రింద వలి బొజ్జ
కదలకను బలుకులోనే పల్కు పరమేశుకు జయ॥ 9॥

మంగళం మంగళం మార్తాండ
తేజునకు మంగళం సర్వజ్ఞమండితునకు।
మంగళం త్రైలోక్య మార్గసంచారునకు
మంగళందేవ గణపతికినిపుడు ॥జ॥ 10

# శ్యమంతకోపాఖ్యానము

యదువంశమునందు సత్రాజిత్తు, ప్రసేనుడు అను సోదరులుండిరి. వారు నిఘ్నుని కుమారులు. సత్రాజిత్తునకు సూర్యభగవానుడు మిత్రుడు. ఒకనాడు సత్రాజిత్తు సూర్యభగవానుని స్తుతించెను. తదేక మనస్కుడై సత్రాజిత్తు చేసిన స్తుతికి ప్రసన్నుడై సూర్యభగవానుడు అతనికి ప్రత్యక్షమయ్యెను. అంతట సత్రాజిత్తు సూర్యునకు ప్రణామములుచేసి స్తుతించెను. ప్రసన్నుడైన సూర్యుడు వరమును కోరుకొనమనెను. అంతట సత్రాజిత్తు సూర్యుని నుండి "శ్యమంతకమణి"ని కోరెను. అది విని సూర్యభగవానుడు శ్యమంతక మణిని తన కంఠమునుండి తీసి సత్రాజిత్తునకు ఇచ్చెను. ఆ సమయమున సూర్యుడు సత్రాజిత్తుతో ఇట్లు పలికెను. ఆ దివ్యమణిని పవిత్రుడై ధరించినచో, ప్రతి దినమూ మణి ఎనిమిది బారువుల బంగారము అనుగ్రహించును. ఆ మణియున్న దేశమున అనావృష్టి, ఈతిబాధలు, అగ్ని,వాయు, విషక్రిములచే ఉపద్రవములు, దుర్భిక్షము మొదలగునవి వుండవు. కాని, అశుచియై ధరించినచో నది ధరించినవానిని చంపును. ఈ విషయములను తెలిసికొని, సత్రాజిత్తు సూర్యునినుండి మణిని గ్రహించి, ధరించి, పురవీధులలో నడచి వచ్చుచుండగా చూచిన పౌరులు, దాని కాంతికి భ్రమసి, సూర్యభగవానుడే కృష్ణదర్శనమునకై వచ్చుచున్నాడని భావించి, ఆ విషయము శ్రీకృష్ణునకు నివేదించిరి. శ్రీకృష్ణుడు అట్టి రత్నము ప్రభువు వద్ద ఉన్నచో దేశాభివృద్ధికి, ప్రజాక్షేమమునకు ఉపయోగపడునని ఆ మణిని ప్రభువైన ఉగ్రశేనునికి ఇప్పింప సంకల్పించెను.

అది తెలిసిన సత్రాజిత్తు ఆ దివ్యమణిని తన తమ్ముడైన ప్రసేనున కిచ్చెను.ప్రసేనుడు ఆ మణని ధరించి వేటకై అరణ్యమునకు వెళ్ళెను. కొంత సమయమునకు శరీరశోదన కారణముగ ప్రసేనుడు అశౌచమును పొందెను. ఆ కారణముచే ప్రసేనుడు సింహము చేతిలో మరణించెను. ఆ సింహమును జాంబవంతుడను భల్లూకము సంహరించి ఆ మణిని తీసుకొని పోయి దానిని గుహలో ఊయలలో నున్న తన కుమారునకు ఆటవస్తువుగా ఇచ్చెను. ఆ పిల్లవాని పేరు సుకుమారుడు.

ప్రసేనుడు అరణ్యములోనికి వేటకై వెళ్ళినపుడు శ్రీకృష్ణుడు కూడా వెంట వెళ్లెను. ఆనాడు భాద్రపద శుక్లపక్ష చవితి ప్రదోష వేళలో ప్రసేనుడు సంహరింపబడెను. వానికై వెదకుచూ శ్రీకృష్ణుడు తలెత్తి చూడగా ఆకాశ మున శుక్లపక్ష చవితినాటి చంద్రబింబము కనబడెను. చీకట్లు బాగుగా ముసురుకున్న కారణముచే శ్రీకృష్ణుడు తన మందిరమునకు తిరిగివచ్చెను. దానికి పూర్వము, దేశ ప్రయోజనముకొరకై, ఆ మణిని శ్రీకృష్ణుడు కోరిన కారణముచేత, అతడే ప్రసేనుని చంపి మణి అపహరించెనని సత్రాజిత్తు, పౌరులు భావించిరి. అంతట ఆ అపవాదును బాపుకొనుటకై, శ్రీకృష్ణుడు మరునాడు, అడవిలో శోధింపగా, ఎముకలు, చిరిగిన బట్టలు, తెగిపడిన ఆభరణములు కనబడెను. దానిచే ప్రసేనుని గుఱ్ఱమును ఏదో క్రూరమృగము చంపి ఉండునని శ్రీకృష్ణుడు భావించెను. అచ్చట గుఱ్ఱపు పాదముద్రలు ఆగిపోయి, ఒక సింహపు పాదముద్రలు కనబడెను. శ్యమంతకమణి మాత్రము దొరకలేదు. కాని కృష్ణుని వెంటవచ్చిన సత్రాజిత్తు సన్నిహితులు, కృష్ణుడే ముందటిరోజు ప్రసేనుని సంహరించి, శ్యమంతకమణిని అపహరించెననియు, రాత్రివేళ సింహము ప్రసేనుని, అతని గుఱ్ఱమును తిని యుండునని నిష్టూరముగా పలికిరి. ఈ అపవాదు నుండి తప్పించుకొను టకై శ్రీకృష్ణుడు మరింత ప్రయత్నము ప్రారంభించెను.

కొంత దూరము వెళ్ళగా అచట సింహపు కళేబరము కనబడెను. అచ్చట నుండి భల్లూకపు పాదముద్రలు కనబడెను. వాని ననుసరించి వెళ్ళి ఒక గుహలోనికి ప్రవేశించెను. అచ్చట యవ్వనమునందున్న ఒక యింతి ఊయలలో పరున్న బాలుని ఊపుచుండెను. ఊయలపై ఆటవస్తు వుగా శ్యమంతకమణి కట్టబడి ఉండెను. ఊయల ఊపుచున్న ఆ లలనయే జాంబవతి. ఆమె కృష్ణునిచూచి ఆయన సౌందర్యమునకు వశపడి, బహుశః ఆయన శ్యమంతకమణికై వచ్చెనని భావించి, గట్టిగా మాట్లాడినచో తన తండ్రి జాంబవంతుడు వచ్చి, శ్రీకృష్ణుకేమైనా ఆపద కల్పించునేమోనని భీతిచెంది, పాటపాడుచున్న దానివలె ఆ శ్యమంతకమణి వచ్చిన విధము నిట్లు చెప్పెను.

శ్లో॥ సింహః ప్రసేనమవధీః సింహో జాంబవతాహతః
సుకుమారక మారోధీః తవ హ్యేష శ్యమంతకః

తా. ప్రసేనుని వధించిన సింహమును జాంబవంతుడు వధించి, శ్యమంతకమణిని తెచ్చెను. ఓ సుకుమారుడా ! ఈ మణి నీకే ఏడవకుము.

అంతలో లోపల నిద్రించుచున్న జాంబవంతుడు లేచి వచ్చి, శ్యమంతక మణి కొరకై శ్రీకృష్ణుడు వచ్చెనని శంకించి, ద్వంద యుద్ధమునకు తలపడెను. ఆ కృష్ణుడే రామావతారకాలమున జాంబవంతునికి చిరంజీవిగా వర మిచ్చెను. ఆ కాలమున జాంబవంతునకు రాముని ఆలింగనమొనర్చుకొన వలెనని కోర్కె యుండెడిది. కాని కృష్ణుడు ఆ కోర్కెనిప్పుడు తీర్చుటకై, జాంబవంతునితో ఇరవైయొక్క (21) రోజులపాటు యుద్ధమొనర్చెను. క్రమ ముగా జాంబవంతుని బలము తగ్గి కృష్ణుడే రాముడని తెలిసికొని ఆయన పాదములపై పడి ప్రార్థించి శ్యమంతకమణిని, తన కుమార్తె అయిన జాంబవతిని శ్రీకృష్ణునికిచ్చి సాగనంపెను.

ద్వారకానగర పౌరులకు ఈ సత్యము తెలిసి, శ్రీకృష్ణుడు శ్యమంతక మణిని సత్రాజిత్తునకిచ్చివేసెను. అప్పుడు సత్రాజిత్తు తన తప్పు తెలిసికొని శ్రీకృష్ణుని క్షమింపమని ప్రార్థించి, తన కన్యారత్నమైన సత్యభామను మణి రత్నమైన శ్యమంతకమణిని, గోపాలరత్నమైన శ్రీకృష్ణునకు సమర్పించెను. కృష్ణుడు భూదేవి అవతారమైన సత్యభామను గ్రహించి శ్యమంతకమణిని సత్రాజిత్తునకే ఇచ్చివేసెను.

ఈలోగా పాండవులు, కుంతీదేవి, లక్క ఇంటిలో కాలి మరణించినారని వార్త వచ్చెను. శ్రీకృష్ణునకు, వారు సజీవులై వున్నారని తెలిసినప్పటికీ, కుటుంబ పెద్ద అయిన ధృతరాష్ట్రుని అనునించుట, లౌకికమర్యాదగా భావించి, హస్తినాపురమునకు వెళ్ళెను. యాదవుల యందే శత ధన్వుడు, కృతవర్మ, అక్రూరుడను ముగ్గురు ప్రముఖులుండెడివారు సత్యభామను శ్రీకృష్ణుకిచ్చి పరిణయము చేయుటకు పూర్వము, వీరు ముగ్గురు ఆమెను తమకిచ్చి వివాహము చేయమని సత్రాజిత్తునడిగిరి. వారిలో ఒకరికి సత్య భామనిత్తునని సత్రాజిత్తు వాగ్దానమొనర్చెను. కాని అనుకోని పై పరిణామ ములలో సత్యభామను శ్రీకృష్ణునకిచ్చి వివాహమొనర్చెను. దానిచే కక్ష

పెంచుకొనిన ఈ ముగ్గురు, ఏకమై కృష్ణుడు లేని సమయమెరిగి, సత్రాజిత్తును సంహరించి శ్యమంతకమణిని అపహరింపమని శతధన్వుని ప్రేరేపింపగా, అతడట్లే చేసి, ఆ మణిని అక్రూరునివద్ద వదలి పారిపోయెను. ఇది తెలిసి శ్రీకృష్ణుడు హస్తినాపురము నుండి వచ్చి, సత్యభామను ఓదార్చి శతధన్వుని సంహరించుటకై బలరామునితో కలసి, రథములో బయలుదేరెను. గుర్రముపై పారిపోవుచున్న శతధన్వుడు, అది అలసి పడిపోగా, దానిని వదలి పరుగిడుచుండెను. అంతట కృష్ణుడు బలరాముని రథమందుండమని, తాను దిగి శతధన్వుని వెంబడించి, పట్టి, ద్వంద్వయుద్ధములో అతనిని సంహరించి ఒడలంతయు వెదుకగా, మణి దొరకదయ్యె అంతట కృష్ణుడు తిరిగి వచ్చి బలరామునకా విషయము తెలుపగా, అతడు, కృష్ణునితో, నీవు బాల్యమునుండియు చోరుడవు, ఇప్పుడు ఆ మణిని నేనడిగెదనని శంకించి, దానిని దాచివైచి నీవిట్లు చెప్పుచున్నావని శ్రీకృష్ణుని నిందించి, నీతో కలసి యుండనని, విదేహ రాజ్యమునకు వెడలిపోయెను.

బాహ్య శౌచము లేక మణిని ధరించి ప్రసేనుడు మరణించెను. అంతః శౌచము లేక (శ్రీకృష్ణుని అనుమానించుటచే) సత్రాజిత్తు మరణించెను. పరమ భక్తుడైనప్పటికినీ, తాత్కాలికముగా భగవద్విరోధ భావము నొందిన అక్రూరుడు మనఃశ్శాంతికై తీర్థయాత్రచేయుచూ, కాశీపట్టణమును చేరెను. అచ్చటికి పోగానే మనఃశ్శాంతిని పొంది శ్యమంతకమణి వలన ప్రతిదినము వచ్చు బంగారమును దైవకార్యములకుపయోగించెను. అక్రూరుడు బాహ్యాభ్యంతర శౌచమును పొంది యుండుటచే అచ్చట అతివృష్టి, అనావృష్టి, రోగబాధలు లేక ప్రశాంతముగా నుండెను.

ఇచ్చట శ్రీకృష్ణుడు బలరామునిచే నిందపడి ఒక్కడే తిరిగి ద్వారకా నగరమును చేరెను. ఈ మణి విషయమై తమ దండ్రులకు కీర్తి కలుగరాదని శ్రీకృష్ణుడు ఏదో మాయచేసెనని, జాంబవతి, సత్యభామలు అనుమానించిరి. శ్రీకృష్ణుడు ఈ అపనిందలకు కారణమేమాయని ఆలోచించుచుండగా, నారదుడేతెంచి భాద్రపద శుక్లచవితి నాటి రాత్రి ప్రసేనునితో అడవికి వెళ్ళినపుడు, చంద్రుని చూచుటయే కారణమని, తద్విశేషమును ఇట్లు చెప్పెను.

శశివర్ణుడను పేరుగల మహాగణపతి, అన్ని లోకములలో విహరించుచూ ఒకనాడు చంద్రలోకమును చేరెను. బాహ్యమున వినాయకుడు మరగుజ్జు, లంబోదరుడూ ఐనప్పటికీ, హృదయమున మిక్కిలి కారుణ్యమూర్తి కానీ, చంద్రుడు పైకి అందగాడైనప్పటికీ, కవులచే వర్ణింపబడినప్పటికీ నడవడి యందు దోషములున్నవాడు అట్టి చంద్రుడు వినాయకుని చూచి వికటముగా నవ్వెను. అప్పుడు చంద్రుని అహంకారమును తగ్గించుటకై, వినాయకుడు, ఎవ్వరేని చంద్రుని చూచినచో అపనిందలు పొందెదరని శపించెను. దానిచే జనులెవ్వరూ చంద్రుని చూడరైరి. దానితో కుంగినవాడై చంద్రుడు తాను జన్మించిన క్షీరసాగరములోనికి వెళ్ళిపోయెను.

చంద్రకాంతి లేమిచే ఓషధులు ఫలించుట మానెను. ప్రజలకు ఆహ్లాదము కరువాయెను. దీనిచే దయతలచి, దేవతలు, ఋషులు, బ్రహ్మ గారివద్దకు పోయి, నివారణోపాయమునర్థించిరి. అంతట బ్రహ్మ భాద్రపద శుక్ల చవితినాడు నక్తవ్రత మొనరింపవలెననీ, (పగటి ఉపవాసము) విఘ్నేశ్వరుని పూజించి, మోదకములు (ఉండ్రాళ్ళు), పండ్లు, కుడుములు, ప్రత్యేకించి దోసపండు నివేదన మొనరింపవలెనని సూచించెను. అప్పుడు చంద్రుడు కూడా ఆ వ్రతమొనర్చి వినాయకుని అనుగ్రహమును పొందెను. అంతట వినాయకుడు, ఒక్క తన అవతారదినమైన భాద్రపద శుక్ల చవితినాటి రాత్రి తప్ప మిగిలిన రోజులలో చంద్రుని చూచిననూ ఎట్టి నిందలూ కలుగవని శాపావకాశమిచ్చెను.

అంతట భాద్రపదశుక్ల చవితినాటి చంద్రదర్శనముచే తనకు కలిగిన నిందలను పోగొట్టుకొనుటకై నారదుని సలహా మేరకు శ్రీకృష్ణుడు వినాయక వ్రతమాచరించెను. వెంటనే వినాయకుడు ప్రత్యక్షమై శ్రీకృష్ణునికి వచ్చిన అపనిందలు తొలగిపోవునని మంగళవాక్కులు పలికెను. అంతట శ్రీకృష్ణుడు తాను సమర్థతతో ఇంత కష్టపడితినిగాని, సామాన్యులకది ఎట్లు సాధ్యమగుననీ, కాన లోకమంతటినీ అను గ్రహింపమని కోరెను.

భాద్రపద శుక్ల చవితినాడు తనను పూజించి, శ్యమంతకోపాఖ్యానమును వినిన వారికి చంద్రుని చూచిననూ అపనిందలు కలుగవని వినాయకుడు వరమిచ్చెను.

ద్వారకా నగరమునందు కలిగిన క్షామనివారణకు మహాభక్తుడైన అక్రూరుని రాక అవసరమని భావించి, శ్రీకృష్ణుడు అక్రూరునకు కబురు పంపెను. పరమ భక్తుడైన అక్రూరుడు ద్వారకా నగరమునకు వచ్చుటచే, అందరికీ శ్యమంతకమణి వృత్తాంతము తెలిసి శ్రీకృష్ణునిపై వచ్చిన అపనిందలు తొలగిపోయినవి. లోపల, బయట శౌచము కల అక్రూరునివద్ద శ్యమంతకమణి శుభపరంపరలిచ్చుచూ నుండెను.

కావున ఈ వ్రత సమయమందు జాంబవతి ఊయల ఊపుచూ చెప్పిన శ్లోకము అందరూ తప్పక పఠింపవలెను.

సుకుమారక మారోధీః అనగా ఆ సుకుమారుడు మనమే. తవః హ్యేషా శ్యమంతకః అనగా ఇప్పుడు గోపాలరత్నము, గణేశరత్నము కూడా మనవై వారి అనుగ్రహముచే ఎల్లరూ ఆయురారోగ్య ఐశ్వర్యములను పొందెదరు.

" మంగళం మహత్ "

## వినాయక మంగళాచరణము

ఓ బొజ్జగణపయ్య నీ బంటు నేనయ్య
ఉండ్రాళ్ళ మీదికి దండు పంపు
కమ్మనినేయియు కడుముద్దపప్పును
బొజ్జవిరగ గదినుచు పొరలుకొనుచు
జయమంగళం నిత్య శుభమంగళం

వెండి పళ్ళెములో వేయివేల ముత్యాలు
కొండలుగ నీలములు కలయబోసి
మెండుగను హారములు మెడనిండ వేసుకొని
దండిగా నీకిత్తుఘనహారతి
జయమంగళం నిత్య శుభమంగళం